# విజ్ఞప్తి

---

రసభరితంబులును, గుణాలంకృతంబులును, విజ్ఞానదాయకంబులును నగు చిన్నిపొత్తంబుల బాలబాలికాశ్రేయోభివృద్ధి పొంటె విరచించి తన్మూలమునఁ బ్రపంచవిజ్ఞానరంగమున వారిం బ్రవేశపెట్టునుద్దేశమున సాహిత్యప్రచారిణీసమాజము నెలకొల్పఁబడినది. ఇందుఁ బ్రథమమణిగ నీతినిధిగ్రంథమాలికనుండి విద్యార్థిశతకము వెలువడినది. ద్వితీయమణి యగు గుణమణిశతకము బాలురహస్తములలంకరింప నుంకించుచున్నది.

నీతినిధిమణులు పద్యాత్మకములు. బాలవినోదినీగ్రంథమాలికను గద్యాత్మకముగ వెలువరింప సంకల్పించితిమి. మా యుద్యమమును లోకమెట్లు మన్నించునో ఉత్కంఠతో నిరీక్షించుచున్నారము.

ఈ నీతినిధి గ్రంథకర్త 'ఆంధ్రభాషాలక్షణశిక్షణము'ను రచించి యాంధ్రలోకమునకుఁ బరిచితుఁడై యున్నందున నతనింగూర్చిగాని యాతని గ్రంథతతినిగూర్చిగాని ప్రత్యేకించి చెప్పవలసిన యవసరము కానరాదు.

మాయుద్యమమును మెచ్చి సమాజమున సభ్యుఁడై తన నీతినిధిగ్రంథమాలికను సమాజము పేరనొసంగి మమ్మాదరించినందులకు గ్రంథకర్తగారి కెంతయుఁ గృతజ్ఞులము.

ఇట్లు
సుధీజనవిధేయుఁడు,
చి. మ. శ్యామరావు.
కార్యదర్శి,
సాహిత్యప్రచారిణీసమాజము

పాకాల,
అక్షయ సం॥ పుష్యశు॥
పంచమీ భానువారము.

శ్రీ రా ము.

# నీ తి ని ధి.

## (వి ద్యా ర్థి శ త క ము.)

శ్రీరామచంద్రుపదపం
కేరుహములమదిని నిల్పి-కించి స్మృతినిం
పారెడునీతులఁ గొన్నిటి
నేరిచివివరింతు వినుము-హితవిద్యార్థీ.

ప్రొద్దుపొడుచుటకు మున్నుగ
నిద్దురలేవఁగ నె దేవు-నిందలఁచుచుఁ జె
న్నొద్దిసి దన హస్తంబును
బెద్దగఁ జూచిన శుభంబు-పృథువిద్యార్థీ.

—: తల్లి :—

క. తనతల్లి కలిమితెస కొ
ప్పను వేయావుల సమాన-ముగఁ గావున నె
ప్పును బ్రథమదైవమని నీ
జననినిబూజింపుమయ్య-సద్విద్యార్థీ.
సురతరువడిగినదిచ్చును
సురమణిసురధేనువల్లె-సూటిగనిచ్చుఁ గ
ధరజననితానుగోరక
సరిపఱచునుసుతునకెల్ల-సద్విద్యార్థీ.

—: తండ్రి :—

క. జననిజనకులు గురుఁడును
మనకాదిమదైవములు క్రమంబున వారిన్
ఘనశుశ్రూషలఁ దనుపుట
మనధర్మముకాదె చూడ-మహివిద్యార్థీ. ౫
జనయిత్రి క్షేత్రమయ్యెను
జనకుఁడు బీజంబునిడు-జననంబునకున్
మనుటకువృద్ధికిఁ గావున
జనకుని భజియింపుమయ్య-సద్విద్యార్థీ. ౬
తనయుఁడు తండ్రి శరీరము
తనయుండగు నంద్రుతండ్రి-తండ్రినిహింసిం
చిన నాత్మహింసయగు నీ
జనకుని బూజింబుమయ్య-సద్విద్యార్థీ. ౭
మనపెద్ద లేదిచెప్పిన
మనమేలున కంచు నెంచి-మహితమనమునన్
బూనరించునతనికగుఁ బ్ర
బ్బినకీర్తియుమంగళంబు-పృథువిద్యార్థీ. ౮

—: గురువు :—

ఎందఱు నీకుగురువులన
నెందఱో నెలనెలకు మాఱి-యెందఱొపోఁగా
నందొకరిఁజెప్ప నెటులగు
నందువెమదినొకనినిల్పు-మావిద్యార్థీ. ౯

అరయఁ'గు' కారము చీఁకటి
పరఁగ 'రు' కారంబు దాని-వవలించునదా
గురుశబ్దవిన్యామహిమను
బొరసినదనినమ్మి కొలువు-భువివిద్యార్థీ. ౧౦

—: దైవము :—

హరిహరభేదము లెంచక
హరిహరనామమ్ములొకని-కైనవెయని యా
హరిహరనామము మదిలో
నిరతముభజియించుసుగుణ-నిధివిద్యార్థీ. ౧౧

హరియని హరుఁడని కాఁడని
పరిపరివిధములను నేరు-వాదాడుపురా
పురుషులకు నరకమేగతి
పర మోక్షముత్రోవ దుర్లభమువిద్యార్థీ. ౧౨

జనియించినపుడు జననియు
ఘనపూజనవేళనింటఁ-గలవేలుపు శ
య్యనుభార్య మోక్షకాలము
ననిరాకారుండుదిక్కు-నయవిద్యార్థీ. ౧౩

—: కాలము :—

మనకాయువునూరేండ్లగు
మనముందుమె యంతదనుక-మదిఁదలఁపంగా

మనయాయువు క్షీణింపఁగ
మనకర్మము కారణంబు-మహివిద్యార్థీ. ౧౪

ఆయువు తక్కువగాఁగ న
న్యేయముగా నాసయిడిభ్ర-మింపించెదు న
త్తోయజగర్భునిచతురత
వేయివిధులమెచ్చవలదె-విధివిద్యార్థీ. ౧౫

చాలవిలువగలిగినదీ
కాలము మఱితిరిగిరాదు-కాలక్షేపం
బేలానిర్దయగలదీ
కాలంబునునమ్మకుంటె-గతివిద్యార్థీ. ౧౬

కాలముదాఁటఁగ రాబది
కూలమొఱయునిర్ఝరంబ-గుండలపోయన్
గాలము దానింగడవం
జాలమయటులగుటఁదెలివిఁ-జనువిద్యార్థీ. ౧౭

కాలమజనులసృజించును
గాలమరక్షించుఁద్రుంచుఁ-గాలముచూడన్
మూలము ముమ్మూర్తులకును
గాలమసుఖదుఃఖకారకము విద్యార్థీ. ౧౮

కాలంబనెడురథాంగము
లీలాగతిఁదిరుగునంద-లివిరెండు మొనల్
చాలుగనవియేసుఖదుః
ఖాలనెడునహర్నిశములు-గదవిద్యార్థీ. ౧౯

కాలము సెల్లుచున్నది
కాలముతీఱుటకొకయప్డు-గలుగును గానన్
గాలమును వ్యర్థపఱుపకు
కాలమసకలంబునెఱుఁగ తివిద్యార్థీ. ౨౦

—: మృతి :—

కాలమునఁ గుడిచికట్టుట
కాలమునను సంగమగుట-కర్మము చేతన్
కాలమరణదము, దప్పన
కాలమరణమెప్పిరంబు-గావిద్యార్థీ. ౨౧

ఒకవిధము కాలమరణం
బకాలమృత్యువులు శతస-హస్రములగు దీ
నికి యోజించిన మనవగు
కుకర్మములె కారణములు-గును విద్యార్థీ. ౨౨

అఁకలికిమున్న కుడుమట
వేకువ మేల్కనకయుంట-వేమాఱులుతిం
టేకాక నిద్రపోవుట
యీకార్యములిమనకాల-మృతివిద్యార్థీ. ౨౩

కల్లుపలువిధములయ్యెను
జుల్లో లెక్కకునుమీఱె-సాంతత్సురికలన్
బొట్లో మట్లోదిగె నిం
కెట్లగునిటుకాక మృత్యు-విలవిద్యార్థీ. ౨౪

## —: సదాచారము :—

మనమే పెద్దలమనుకొని
మనపెద్దల గేలి సేఁతె-మనమాంద్యమ్మౌ;
మనలోఁ దెలుఁగ మునుపెన న
ల్పుని నేరని గుంజనితని-భువి విద్యార్థీ. ౧౭

ఎఱిఁగియె చేసిరో చట్టము
తెలుఁగక యొనరించినారో-యెఱుఁగకె మనవిరా
తెలుఁగునఁ దప్పిసడ తెలగు
తెలుఁగఁగ? మోహింపుమాను-విని విద్యార్థీ. ౧౮

పలుపురు పెద్దలువలదని
పలికినపని చేయఁజనదు-ప్రాజ్ఞన కెపుడున్
పలుపురులోఁ దనుమ పువున
పలికి వినకే దూఁకు వెఱ్ఱి-విధి విద్యార్థీ. ౧౯

దేశి సమనమునఁ దలఁతువా
దానిన పోటను వచించి-దానిన చేయన్
జ్ఞానులు 'త్రిశుద్ధి' యంచును
దానిననుదుర దియనీకుఁ-దగు విద్యార్థీ. ౨౦

వైపూఁతయేమి గుణమగు?
లోపలసుగుణంబు వెలయ-లోకము మెచ్చన్
జేఁపిడని నోష్టడ్డాపున
కేపున ఫలము న్నెగంటు-లిడ విద్యార్థీ. ౨౧

ధరనెంతచపువుచదివిన
స్థిరముగ సిరెండువిధులె-చెప్పంబడెడిన్
బరపీడపాపకార్యము
పరోపకారంబమంచి-పని విద్యార్థీ. ౩౦

కురరూఢదంపతుల నడుమ
గురుశిష్యులనందిశివుల-కున్ మధ్యమునన్
ఖరములనడుమను నడచిన
బొరయువుమనతలచుకార్య-ములు విద్యార్థీ. ౩౧

గురుశిష్యావళికివధూ
వరులకుసుతజనకులకును-వరభృత్యధరా
వరులకుబగ వెట్టినయా
నరునకునరకంబుదప్పునావిద్యార్థీ. ౩౨

—: సహవాసము :—

సుమనస్సంగమునఁ బురువు
సుమనస్సులశిరముఁజేరి-సొంపొందును బూ
జ్యములగు శిలలును గలదే
సుమనస్సంగమునకెనవ-సుధవిద్యార్థీ. ౩౩

ఇచ్చుట పుచ్చికొనుటయును
నిచ్చనుగోప్యంబుచెప్ప-నేర్పడవినుటల్
మెచ్చించి యిడుటతినుటయు
నచ్చపుఁజెలికానిగొనము-లగువిద్యార్థీ. ౩౪

చెడువానిఁ జేర నెప్పుడుఁ
జెడు గేవాటిల్లుఁగాని-చెందవు శుభముల్
చెడఁగాలుచు నంగారమె
కడు నలుపిడుఁ బిదపముట్టుఁ-గదవిద్యార్థీ. ౫౬

ఖలులోకపరిసత్కార్యం
బుల నొనరుప నమ్మి చేరఁ-బోకుము చెడుగాఁ
బుల్ఖుల్లయుపవాసములు పశు
పుల నెక్కువ చంపఁగాదె-భువి విద్యార్థీ. ౫౭

ఎమటను నిచ్చకమాడుచుఁ
బదపడి మఱుఁగైనఁ గార్య-భంగిమఁ దలకౌ
ట్టుదురాత్ము చెలిమి విడ్జిం
పఁదగుఁ దేనెగల కత్తి-వతె విద్యార్థీ. ౫౮

ఆటోపంబునఁ గొంచెము
బూటకమునఁ గొంతగుణము-పొడనగాపిసన
చ్చోటన వగుణము మెండౌ
తాటోటును ఫణిగ వీడఁ-దగు విద్యార్థీ. ౫౯

గుణముగని ప్రాజ్ఞులా గుణ
గణనంబున సంతసింత్రు-కరువలి వృక్షం
బునఁ బుష్ప సౌరభముఁగొనఁ
గనెయామోదంబునందు-గతి విద్యార్థీ. ౬౦

గుణములను విడిచి యజ్ఞులు
గఁణి యింతురు దోషములను-గస్తురి పైని

ల్చునె యీఁగలుపుంటిని
ల్చినయట్టులునీవచెప్పుమ-స్థిరవిద్యార్థీ.

—: భా ష :—

భాషలలోన ననుత్తమ
భాష తెనుఁగుగాన నట్టి-భాషామణికిన్
వేషముమాఱిచి సంకర
యోషగఁ జేయకుము సుగుణ-యుతవిద్యార్థీ. ౪౨

ఏబాసనుమాటాడుదు
వాబాసను నచ్చముగను-నాడిన బాగౌ
నే బాసో యింకొనిపివగ
తో బెక బెకలాడ నేరు-తువె విద్యార్థీ. ౪౩

ఆ దేశస్థులు నవ్వఁగ
ని దేశస్థులును నవ్వ-నింపు సెడఁగ భా
షాధైన్యము దొరయుటయే
లాదోఁపదు భాషకైఁ జ-లమ? విద్యార్థీ. ౪౪

—: మా ట తీ రు :—

సమయమెఱిఁగి మాటాడిన
సమయస్ఫూర్తియును జాల-సముచితమగు నా
సమయజ్ఞత లేమిని దుః
ఖమయగు నోదార్పు గూడఁ-గదవిద్యార్థీ. ౪౫

మృదుతనుదారుణమడఁగును
మృదుతనదారుణమడంగు-మృదుతకసాధ్యం
బెదియుంగానము గావున
మృదుతరముగ మాటలాడు-మీవిద్యార్థీ. ౩౬

స్వరభేదమైన పలుకునఁ
గరముచెడును భావమందుఁ-గార్యముచెడు నే
స్థిరమగు; నిష్టార్థంబును
వరమడిగినత్వష్ట చెడియె-వరవిద్యార్థీ. ౩౭

సత్యమున రవి వెలుంగును
సత్యమున నయగ్నిమండు-జలదముకురియుఁ
సత్యమజనులకు దైవము
సత్యముపలుకంగవలయు-సద్విద్యార్థీ. ౩౮

—: చదువుట. :—

అర్థమెఱిఁగిచదువుట కా
వ్యార్థప్రదమంద్రు పెద్ద-లదియారసిస్వ
ష్టార్థకముగఁ జదువుము ధ
ర్మార్థాదికములను నీకు-నగువిద్యార్థీ. ౩౯

రసము నెఱుంగక చదివినఁ
బసయుండదు కంఠశోష-ఫలశూన్యము నా
రసమెఱుఁగునె రాసభములు
గసతో గంధమును మోవఁ-గ నెవిద్యార్థీ. ౪౦

అఱగొఱగఁ జదివి తానే
నెఱజాణఁడటంచు నిఱ్ఱి-నీల్గు మఁమదినే
దెఱుఁగక చెడియెదు నిప్పటి
కొఱమాలిన చదువు చదువ-కుము విద్యార్థీ. ౫౧

—: మర్యాదము :—

ఒప్పైనయర్థ మెఱుఁగమిఁ
దప్పనివాదింపకుము మ-తగ్రంథములం
దెప్పుడుఁ దప్పెంచుటయగు
నొప్పమియును హీనబుద్ధి-యును విద్యార్థీ. ౫౨

తెలియునని వాదులాడుచుఁ
దెలిపిన వినకున్నఁ దాను-దెలియక యున్నన్
బలుకష్టము వానికిఁ దాఁ
దెలుపుటతోనై దుసురులుఁ-దెగు విద్యార్థీ. ౫౩

మున్నెఱిఁగినవానిం బలె
నెన్నఁడు గురుతోడఁ బృచ్ఛనెకసక్కెముగాఁ
బన్నకుమది నీవృద్ధికి
సున్నయు దుష్కీర్తికరము-చుమి విద్యార్థీ. ౫౪

తగువిషయముఁ జింతింపక
యగోచరమనూహ్యమెట్టు-లగుఁ జింతింపన్

దగు మొదటిమెట్టు నెక్కక
మిగుల కెగుర నగునె పడవె-యిలవిద్యార్థీ. ౫౫

కైగురుశక్తి చాలదు
ప్రాఁకినడకతనకు హీన-వర్తనమాయే
కాకికగు గబ్బిలపుగతిఁ
బోకయును త్రిశంకుని పదమును విద్యార్థీ. ౫౬

—: శిష్యలక్షణము :—

పతివిడిచినట్టి సతిసం
గతిమాతృవిహీన శిశువు-కరణిని గురుసం
గతిలేని శిష్యుచదువులు
వితయచు మాయొంచఁగా భు-వినివిద్యార్థీ. ౫౭

సమబుద్ధి సాధుసేవయు
సముచితచరితంబు దాంతి-శాంతియు విశ్వా
సము శాస్త్రములయెడ విన
యముసత్యము శిష్యగుణము-లగువిద్యార్థీ, ౫౮

ఒకటిచదువు రెండడఁకువ
ప్రకటితముగ మూఁడు తెలివి-భావాభావ
ప్రకటననాలుగ యిదున
మ్మికపాళులుగావలయుఁజు-మీా విద్యార్థీ. ౫౯

మనమును వాక్కును కరములుఁ
గనులును గుహ్యంబుశుద్ధిగాఁ గలవారల్
ధనకాంతలయెడనున్నను
గనుఁగొనభయమేమిలేదు-గదవిద్యార్థీ. ౬౦

గురువును వైద్యునినావికుఁ
బరిణయమగుపిదపజననిఁ-బాపులుగలఁకన్
దెరలింతురు పనిముగియుడు
జరపకునీవట్టులెపుడు-సద్విద్యార్థీ. ౬౧

—: ఆరోగ్యము :—

ఆరోగ్యంబు ప్రధానం
బారయ దేహాలకెల్ల-నది బలమూలం
బై రాజిల్లుట బలమును
ధీరులుసాధింపఁదగు వి-ధిగవిద్యార్థీ. ౬౨

పురమును భూదారునిక్రియ
నరదంబును రథికుఁనివలె-నాత్మనిలయమున్
నరుఁడేమఱకెల్లప్పుడు
బరిరక్షణసేయవలయు-వరవిద్యార్థీ. ౬౩

ప్రాణాపహర్తకాలుఁడు
ప్రాణధననిహంతయగుఁగు-వైద్యుఁడు దేహ

త్రాణార్థి వెజ్జయోగ్యత
గానక పిలువంగఁ దగదు-గద విద్యార్థీ. ౬౪

వ్యాయామమునకుఁ దలముఁ
గై యితరంబులకుఁ బెద్ద-వైపా తాళిఁ
నియుక్తులఁ బెద్దసైత్ర
వాయాడకు వదరుఁబోతు-వై విద్యార్థీ. ౬౫

—: జ్ఞానము :—

కొఱగాని యక్కరంబును
గొఱగాని నరుండుఁ జాలఁ-గూడని గుణముఁ
గొఱగాని మూలికయు లే
దెఱుఁగు తెఱుఁగు నెఱుక కొఱను-హీని విద్యార్థీ. ౬౬

మనుజునకు విద్యకంటెను
గనులును సత్యంబుకంటె-ఘనతపము సుఖం
బునఁ ద్యాగముకంటెను మిం
చినదీ భువి లేను లేను-స్థిర విద్యార్థీ. ౬౭

సుముఖుండై యిహసుఖదుః
కములాదిగఁ గల్గు ద్వంద్వ-కర్మములఁ దగఁ
సమముగఁ జూచు నతనిలో
కము తప్పక చెప్పు జ్ఞాని-గా విద్యార్థీ. ౬౮

## —: ధ న ము :—

ముందుభయచేతనముదా
నిందట్ల 'ధనంధన'మ్మ-నియశబ్దించున్
బొందవలదెచేతనుఁడై
పొందుగసంసారిధనము-మును విద్యార్థీ. ౬౯

ధనమునఁగులగౌరవమగు
ధనమునసకలంబుఁదన్నుదగ్గఱికొలుచున్
ధనమేమూలముజగతికి
ధనమునున్యాయ్యముగఁగూర్పఁదగువిద్యార్థీ. ౭౦

నాయంబుననార్జితమగు
నాయముఁదాఁదినఁగవచ్చు-నర్థులకిడఁగా
శ్రేయమొనఁగూర్చునిఁకన
న్యాయార్జితమందుఫలము-నహివిద్యార్థీ. ౭౧

## —: మ ద ము :—

కులమాచారము ధనమును
విలసితవిద్యయును రాజ్య-విభవమురూపం
బెలఁబ్రాయముఁదపమునువ
ద్ధిలఁజేయునుమదమునండ్రు-స్థిరవిద్యార్థీ. ౭౨

వేఁడిమియగ్నికిఁ జలనము
గాడుపునకు శీతగుణము-కంజారికినా

పాడిధనికునకుమదమిలఁ
గూడుటధ్రువమిద్దిచేర్ప-కుమువిద్యార్థీ. ౨౩

అంగములద్రఢిమగలిగియు
సంగవిహీనునిగఁజేసి-యాడించుట బం
ధుంగురుసంప్రదోగము
సంగనకుంబెట్టిఁగివిడుము-నయవిద్యార్థీ. ౨౪

—: తృష్ణ :—

జీర్ణములగుఁగేశంబులు
జీర్ణములగురదనములునశీకృతబలముల్
జీర్ణములగుఁగనులు సెవుల్
జీర్ణముకాదయ్యతృష్ణ-స్థిరవిద్యార్థీ. ౨౫

—: ప రో ప కా ర ము :—

మనుజుఁడుగా జన్మించిన
జనులకుహితమాచరింపఁ-జనదేయరయన్
జినచిన్నప్రాణికోటులె
మనుజునకుపయోగపడవె-మహివిద్యార్థీ. ౨౬

జ్ఞాతులునల్వురులోభికి
భూతలమునధర్మమగ్ని-భూపుఁడుచోరుం
డేతత్త్రిధర్మముపాదలదో
ఘాతుకులయ్యెదరుపరులు-కనుమివిద్యార్థీ. ౨౭

దానమునశత్రుజయమగు
దానముననవ్యాధిపోవు-దానమువలనన్
జానలునువిద్యయొడఁబడు
దానమెపురుషార్థదంబు-తగవిద్యార్థీ. ౭౮

దానముచేయుట ధర్మము
మానవులకుఁబాత్రదాన-మాత్రముశ్రేష్ఠం
బానందునపాత్రునకిడు
దానంబునఁబాపమబ్బుధరవిద్యార్థీ. ౭౯

అడిగినయాతనియక్కఱ
నడవడియాచితియుఁదనధ-నముపోయెమనా
నడిదేశకాలములెఱిఁగి
యిడుదానమెపాత్రమందు-రిలవిద్యార్థీ. ౮౦

వెలలియిడుటుత్తమముమఱి
పిలిచియిడుటమధ్యమంబు-వేఁడునతనికా
వలనిచ్చుటయధమముభృ
త్యులకిడుటధమాధమంబు-స్తుతవిద్యార్థీ. ౮౧

—: యాచ్ఞ :—

నడకతడఁబడునుగాత్రము
దడజనియించెడినిగద్గ-దస్వరము భయం

పెడఁదఁగలుగుమ్మృతిచిహ్నము
లడిగెడు చోవలవ దెవరి-కదివిద్యార్థీ. ౨౨

లఘువస్తువుత్పృణమంతకు
లఘువగుఁదూలంబు దాన-లఘువగుమఱియుఁ
లఘుతమమగుయాచ్ఞాగుణ
మఘుదూరా! నీకువలవ-దదివిద్యార్థీ. ౨౩

—: అ తి క్ర మ ము :—

అతిదానంబునఁ గర్ణుఁడు
దితిమనుమండై నబలియుఁ-దేజముసెడరే
అతియేశ త్రువుజనులకు
నతియొందునువిడిచినడవ-నగువిద్యార్థీ. ౨౪

అతిలోభిమైను యోధనుఁ
డతిలోభంబుననుగుక్క-యలజడివడడే
ఏతరులయాస్తినిగోరక
గతినోరులకుఁజూపుదాత-గావిద్యార్థీ. ౨౫

అతిమూర్ఖుఁడై నరావణుఁ
డతిరూపిణియైనసీత-యలజడివడరే
అతికామిపజ్త్రిరథుఁడును
నతియొందునువిడిచినడవ-నగువిద్యార్థీ. ౨౬

## —: భాజనము :—

కారకుఁడను మోదకుఁడును
ప్రేరకుఁడును గర్తనల్వురే సమభాగుల్
ధారుణిఁ గార్యఫలమునకు
నారసియిది నీవు నడవ నగు విద్యార్థీ.

## —: దుస్సహము :—

ఘనదుస్సహములు నాలుగు
తనపెండ్లము దుష్ట సఖ్యత నకృషియందున్
దనపుత్త్రుఁ డవిద్వాంసుఁడు
తనకడుపునొప్పియగుట ధరవిద్యార్థీ. ౭౭

జనకుండు ఋణము చేసిన
జననియు విటియైన నంపె జాయయయిననున్
దనయుఁడు శుంఠయయిన నే
స్తునిశత్రులు వారలండ్రు స్తుతవిద్యార్థీ. ౭౮

## —: పూజ్యత :—

అలువులకు నధికపూజ్యత
గలుగును నధికులకుఁ గొంత గలుగును దుదిని
ష్ఫలనిస్సుమతరుజాలం
బులఁగన వేమేటిభవనములవిద్యార్థీ. ౮౦

ఘృతభాండముఖముఁజూడరు
మతిఁదలఁపరుసురకుఁబూజ-మాలికలునహో
రతులును జెప్పనగు నెకలి
కృతమహిమముగాకయున్న-దే? విద్యార్థీ. ౼౧

—: ప్రజ్ఞ :—

మొదిమి మొదటమానసమునఁ
బిదపశరీరమునఁదోఁచు-విద్వాంసునకున్
మదిఁదోఁచుఁగానిజడునకుఁ
మదిఁదోఁపదుతనువునందు-స్తుతవిద్యార్థీ. ౼౨

హాలాపానులకును స్త్రీ
లోలురకునుమదిని మొదట-లుబ్ధులకును మ
స్థాలికినిరంతరము ప్ర
జ్ఞాలాభమువోరయుదరసి-నన్ విద్యార్థీ. ౼౩

—: పా ప ము :—

పాపమని చేసిపిమ్మటఁ
దాపపడినఫలములేదు-తప్పికొనవలెన్
బ్రాపగునడుసునఁగాలిడి
వాపినిగాల్గడుగుజడుని-వలెవిద్యార్థీ. ౼౪

పాపములలోననెక్కుడు
పాపముతనునమ్మినట్టి-వానిఁజెఱుపు త

త్రాపమెభూమికిబరువఁట
యోపికనిదియరసినడువు-మురువిద్యార్థీ. ౯౫

చాలఁగఁ శాపముచేసిన
పాలసుఁడిభువనమందు-బాలురవలనన్
గాఘులతన్నులుదినఁగాఁ
బాలగుఁగాల్బంతియగుచు-వరవిద్యార్థీ. ౯౬

—: సే వ :—

జనములయాదాయంబును
గనియాఱవపాలుకాన్క-గాఁగొనిన్యాయ్యం
బుననడచునరపతినిగొలి
చినభక్తియుముక్తిగలుగు-స్థిరవిద్యార్థీ. ౯౭

జనములగానుగునిడిరస
మున్పిదావెడుభూపుఁగొలువ-ముక్తియటుండన్
మునుభక్తికెసందియమగు
వెనుకవిడదురౌరవంబు-వినువిద్యార్థీ. ౯౮

చదువెంతచదివియుండిన
ముదమొదవెడుకొలువునందు-మురిసినభక్తిన్
మదిఁదలఁపకలోకేశునిఁ
గొదలేనిసుఖంబుమనక-గునె? విద్యార్థీ. ౯౯

భుక్తికిఁగలచదువులనే
రక్తిఁజదివిక్రొల్లుపుగొలువ-రాణచెలఁగునే?
భుక్తికిఁగుక్కలుగొలువవె
ముక్తిచదువెచదువుముఖ్యముగవిద్యార్థీ. ౧౦౦

—: పారమార్థికము :—

ఇటఁగలమన్నృపులకటలే
నిటలేదటఁగలదుయతుల-కెన్నఁగసుఖముల్
ఇటనటసజ్జనులకుఁగల
దిటనటదుష్టులకులేదు-హితవిద్యార్థీ. ౧౦౧

చదువన్ననేమి? నేర్వఁగుఁ
గద! నేననువస్తువుమన-కాయంబనను
న్నదియెచ్చటనోనేరని
చదువుచదువసార్థకంబె-సద్విద్యార్థీ. ౧౦౨

నీవునునేననుభేదం
బేవస్తువునందుఁగలుగు? నెల్లయెడని
కావరమువీడిచూచిన
నీవేననుభేదమున్న-దే? విద్యార్థీ. ౧౦౩

పగిలినమృద్భాండమ్మును
బాగులకవర్జింపవలయుఁబోయినదానిఁ

దిగవిడిచియవలనేమ్పుట
నగుఁబాటగుఁగా బెచూడ-నయవిద్యార్థి. ౧౦౪

మొదటనకొయ్యలు రెండొక
నదిగట్టునఁగలిసియుండు-నదిలోఁబడఁగా
వదలుచుఁగలియుచు దారలును
నిదిగనిచింతింప నేల-హితవిద్యార్థి. ౧౦౫

ఒకతరువుననొకయుప్పుడు
ప్రకటముగ ననేకజాతి-పక్షులు వసియిం
చికడకు దిశలకరుగుదీ
నికొఱకుఁజింతింప నేల- నెఱివిద్యార్థి. ౧౦౬

జోకనునూర్యుఁడుపుట్టినఁ
జకటివిడున స్తమింపఁ-జీఁకటియయగుణ్
దేఁకువదీని నెఱిఁగియూ
చీఁకటికై వెఱవనేల?-స్థిరవిద్యార్థి. ౧౦౭

సుకము వెనుక దుఃఖంబగు
సుకమగుదుఃఖంబువెనుక-సొరిదిని వైక
ల్పికముగఁ బ్రతినరునకు దీ
నికొఱకుఁజింతింప నేల-నెఱివిద్యార్థి. ౧౦౮

శ్రీరామాభిఖ్యుండను
శ్రీరామపదారవింద - సేవారతుఁడన్
పేరుగ నీశతకంబొక
తీరుగ నీకొఱకు వ్రాసి-తిని విద్యార్థీ. ౧౦౯

శ్రీరామార్పణము

శ్రీ శ్రీ శ్రీ

Printed at the T. V. C. Press, Madras.

శ్రీ రామ.

# నీతినిధి ప్రథమమణి.

(విద్యార్థి శతకము.)



—: గ్రంథకర్త :—

గాతలపట్టు శ్రీరాములు రెడ్డి.